# వరసిద్ధి

# వినాయకశతకము

## శమంతకోదంతము



2 అణాలు. తిప్పాభట్ల రామయ్య.

ఓమ్.

శ్రీరస్తు.

శ్రీశారదాంబాయై నమః.

శ్రీ వరసిద్ధివినాయక వ్రతకథ యనంబడు

శ్యమంతకోపాఖ్యానముఁగల

# వినాయకశతకము.

ఇందు

శ్రీవరసిద్ధివినాయక పూజా విధానంబును

నూతనాష్టోత్తర శతనామంబులును గలవు.

ఇది

పెదవేఁగిపుర నివాసుఁడగు

తిప్పాభట్ల రామయ్యచే

రచియింపఁబడియె.

మంజువాణీ ముద్రాక్షరశాల.

 [వెల 0—2—0

# మ న వి.

బుధవరేణ్యులారా !

ముక్తిదాయకమగు మహావ్రతములలో, శ్రీ వరసిద్ధి వినాయకవ్రతము, మోక్షాంగనా శిరోభూషణ మనకఁదప్పదు. అట్టి మహాపవిత్రమగు వరసిద్ధి వ్రతము నాచరించు, సద్భక్తవరేణ్యు లిహంబున, నఖండ సుఖభోగంబుల ననుభవించి, మోక్షార్హులగుదురనుట, నిర్వివాదాంశము. పరమపావనమగు నేతద్వ్రతము, నన్నికులములవార లాబాలగోపాల మన్నికాలముల యందును, సలుపవచ్చును. అందుఁ బ్రతిసంవత్సరము భాద్రపద శుద్ధ చతుర్థినాఁడీ వ్రతముఁ దప్పక నాచరించుట పరమ శ్రేయోదాయకము. ఈ వ్రతము నుల్లంఘించిన వారలు సర్వవిధముల నధోగతి పాలగుదురనుటలో సందియ మిసుమంతయు లేదు. నా శ్రద్ధాభక్తుల కొలది, తద్వ్రత విధానంబును, నూతనాష్టోత్తర శతనామంబులును, వినాయక నక్షత్రమాల యను స్తోత్రరాజంబును, శతకరూపముగఁ దత్పవిత్రకథయును రచించి, పరమభక్తిని సకలభక్తలోక సామ్రాజ్యధురంధరుఁడగు శ్రీ సిద్ధివినాయకునిఁ గృతినాయకునిగాఁ జేసితిని. కాన నిఁదలి నా తప్పుల నెన్ని నిరసింపక, మీ కరపద్మములతో నీ కృతికన్యను మన్నించి, పరమకరుణా సముద్రుండగు మే తత్కృతినాథుని కరుణకుఁ బాత్రులై పవిత్రు లయ్యెదరుగాక!

ఇట్లు

గ్రంథకర్త.

### పూజకుఁగావలసిన పుష్పములు—పత్రములు.

| | | | |
|---|---|---|---|
| ౧ | మాచీపత్రములు | ౧౨ | దానిమ్మ |
| ౨ | వాకుడు ,, | ౧౩ | దేవదారు |
| ౩ | బిల్వదళములు (మారేడు) | ౧౪ | మరువము |
| ౪ | గరిక | ౧౫ | వావిలి |
| ౫ | ఉమ్మెత్త | ౧౬ | జాజి |
| ౬ | రేగు | ౧౭ | వెలగ |
| ౭ | ఉత్తరేణి | ౧౮ | రావి |
| ౮ | తులసి | ౧౯ | జమ్మి |
| ౯ | మామిడి | ౨౦ | మద్ది |
| ౧౦ | గన్నేరు | ౨౧ | జిల్లేడు |
| ౧౧ | విష్ణుక్రాంతము | ౨౨ | నేరేడు |

ఓమ్.

# శ్రీ సిద్ధివినాయక పూజావిధానము.

ఆచమ్య... ...మమోపాత్త దురిత క్షయద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం, శుభే శోభనముహూర్తే, శ్రీ మహా విష్ణు రాజ్ఞయా ప్రవర్తమానస్య, అద్యబ్రహ్మణః, ద్వితీయ పరార్ధే శ్వేత వరాహకల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరోః దక్షిణ దిగ్భాగే, శ్రీశైలస్య ఈశాన్యప్రదేశే, కృష్ణా గోదావరి యోర్మధ్యదేశే, శోభనగృహే, సమస్తదేవతా బ్రాహ్మణ

సన్నిధౌ, అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన... సంవత్సరే, దక్షిణాయనే, వర్షర్తౌ, భాద్రపదమాసే, శుక్ల పక్షే, చతుర్థ్యాం......వాసర యుక్తాయాం శుభనక్షత్రే, శుభయోగే, శుభకరణ, ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ, శ్రీమాన్......గోత్రః......నామధేయః శ్రీ మతః......గోత్రస్య......నామధేయస్య, ధర్మపత్నీ సమేతః తస్యాయుష్యాభి వృద్ధ్యర్థం, అస్మాకం సహకుటుంబానాం క్షేమస్థైర్య విజయాయు రారోగ్యైశ్వర్యాభి వృద్ధ్యర్థం, ధర్మార్థ కామమోక్ష చతుర్విధ ఫల పురుషార్థ సిద్ధ్యర్థం, మనోవాంఛా ఫలసిద్ధ్యర్థం సమస్త మంగళావాప్త్యర్థం, మమోపాత్త సమస్త పాపక్షయద్వారా శ్రీవర సిద్ధివినాయక దేవతాముద్దిశ్య, శ్రీవర సిద్ధి వినాయక దేవతాప్రీత్యర్థం, ధ్యానావాహనాది షోడశోప చార పూజాంకరిష్యే, తదంగకలశారాధనం కరిష్యే. శ్లో॥ గంగే చ యమునేచైవ, గోదావరి సరస్వతీ। నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు॥ ఆయాంతు శ్రీవర సిద్ధివినాయక దేవ తాపూజార్థం మమదురిత క్షయకారకాః సర్వతీర్థమావాహ్య, కలశే గంధపుష్పాక్షతైరభ్యర్చ్య, కలశోదకేన, దేవ మాత్మానం పూజాద్రవ్యాణి సంప్రోక్ష్య, మం॥ అసునీతే......మువహ్వా యతే, ప్రాణప్రతిష్ఠాపన ముహూర్త స్సుముహూర్తోఽస్తు.

శ్లో॥ ధ్యాయేద్గజాననందేవం। తప్తకాంచనసన్నిభం
చతుర్భుజం మహాకాయం। సర్వాభరణభూషితం॥ ౧
శ్రీవర సిద్ధివినాయక దేవతాయైనమః। ధ్యాయామి.

శ్లో॥ అత్రాగచ్ఛ జగద్వంద్వ । సురరాజార్చితేశ్వర
అనాథనాథ సర్వజ్ఞ । గౌరీగర్భ సముద్భవ॥
శ్రీవర ... ... యైనమః । ఆవాహయామి.

శ్లో॥ మౌక్తికైః పుష్యరాగైశ్చ । నానారత్నైర్విరాజితం
రత్నసింహాసనంచారు । ప్రీత్యర్థం ప్రతిగృహ్యతాం ॥ 3
శ్రీవర ... యైనమః నవరత్నఖచితాసనం సమర్పయామి.

శ్లో॥ గజవక్త్ర నమస్తేస్తు । సర్వాభీష్ట ప్రదాయక
భక్త్యాపాద్యం మయాదత్తం । గృహాణద్విరదానన॥ 4
శ్రీవర ... యైనమః పాదయోః పాద్యం సమర్పయామి॥

శ్లో॥ గౌరీపుత్ర నమస్తేస్తు । శంకర ప్రియనందన
గృహాణార్ఘ్యం మయాదత్తం । గంధపుష్పాక్షతైర్యుతం॥ 5
శ్రీవర ... యైనమః హస్తయోరర్ఘ్యం సమర్పయామి॥

శ్లో॥ అనాథనాథ సర్వజ్ఞ । గీర్వాణ వరపూజిత
గృహాణాచ మనందేవ । తుభ్యందత్తం మయాప్రభో॥ 6
శ్రీవర ... యైనమః । ఆచమనీయం సమర్పయామి॥

పంచామృతస్నానం (పంచామృతములనగా, ఆవుపాలు, ఆవు పెరుగు, ఆవునెయ్యి, తేనె, నారికేళోదకము (కొబ్బరికాయనీళ్ళు), యీ అయిదు వస్తువులు కలిపి తమలపాకుతో దేవునిపై చల్లవలెను. 7

శ్లో॥ స్నానం పంచామృతైర్దేవ । గృహాణ గణనాయక
అనాథనాథ సర్వజ్ఞ । గీర్వాణ గణపూజిత
శ్రీవర ... యైనమః పంచామృతస్నానం సమర్పయామి॥

శ్లో॥ గంగాది సర్వతీర్థేభ్య । ఆహృతైరమలైర్జలైః
స్నానంకురుష్వ భగవ । న్నుమాపుత్ర నమోస్తుతే
శ్రీవర ... యైనమః శుద్ధోదక స్నానం సమర్పయామి.
శ్లో॥ రక్తవస్త్ర ద్వయంచారు । దేవయోగ్యంచమంగళం
శుభప్రద గృహాణత్వం । లంబోదరహరాత్మజా 8
శ్రీవర ... యైనమః వస్త్రయుగ్మం సమర్పయామి.
శ్లో॥ రాజితం బ్రహ్మసూత్రంచ । కాంచనంచోత్తరీయకం
గృహాణదేవసర్వజ్ఞ । భక్తానామిష్టదాయక॥ 9
శ్రీవర ... ... యైనమః యజ్ఞోపవీతం సమర్పయామి.
శ్లో॥ చందనాగరుకర్పూర । కస్తూరికుంకుమాన్వితం
విలేపనం సురశ్రేష్ఠ । ప్రీత్యర్థం ప్రతిగృహ్యతాం॥ 10
శ్రీవర ... ... యైనమః దివ్య, శ్రీచందనం సమర్పయామి.
శ్లో॥ అక్షతాన్ ధవళాన్ దివ్యాన్ । శాలీయాంతండులాన్ శుభాన్
గృహాణపరమానంద । శంభుపుత్ర నమోస్తుతే॥ 12
శ్రీవర ... ... యైనమః అలంకరణార్థ మక్షతాన్ సమర్ప
యామి పుష్పైః పూజయామి.

అష్టోత్తరశతనామపూజ.

౧ ఓం అక్షయాయనమః
౨ ఓం అణిమాద్యష్ట సిద్ధిప్రదాయనమః
3 ,, అరిషడ్వర్గ భేదనాయనమః
౪ ,, అమృతార్ణవ మధ్యస్థాయనమః
౫ ,, ఆదిమధ్యాంత శూన్యాయనమః

౬ ,, ఆదిత్యముఖ సురసేవితాయనమః
౭ ,, ఇభవక్త్రాయనమః
౮ ,, ఇందీవర నిభేక్షణాయనమః
౯ ,, ఈశ్వరసుతాయనమః
౧౦ ,, ఈప్సితార్థ సిద్ధిప్రదాయనమః
౧౧ ,, ఉమాపుత్రాయనమ.
౧౨ ,, ఊర్ధ్వచారిణేనమః
౧౩ ,, ఊర్ధ్వకేశాయనమః
౧౪ ,, ఋషిమండల సంచారిణేనమః
౧౫ ,, ఋషిదేవ నమస్కృతామల పాదకమలాయనమః
౧౬ ,, ఌప్తధర్మప్రవర్తనాయనమః
౧౭ ,, ఏకదంతాయనమః
౧౮ ,, ఏకభక్తిమదర్చితాయనమః
౧౯ ,, ఐహికాముష్మికప్రదాయనమః
౨౦ ఓం ఐశ్వర్య కారణాయ నమః
౨౧ ,, ఓంకారరూపాయ నమః
౨౨ ,, ఓంకార నాదప్రియాయ నమః
౨౩ ,, ఔపాసన ఫలప్రదాయ నమః
౨౪ ,, అంధకాసురభంజనాయ నమః
౨౫ ,, కపిత్థపనస ఫలప్రియాయ నమః
౨౬ ,, కపిలాయ నమః
౨౭ ,, కాత్యాయనీగర్భ శుక్తిముక్తాయ నమః
౨౮ ,, కమలా ప్రియాయ నమః
౨౯ ,, కల్యాణ శైల మందిరాయ నమః

౩౦ ,, కేశవనుత పుణ్యచరిత్రాయ నమః
౩౧ ,, కర్మ నిర్మూల కారణాయ నమః
౩౨ ,, కుక్షిస్థాఖిల భువనాయ నమః
౩౩ ,, కమనీయ సద్గుణ భూషితాంగాయ నమః
౩౪ ,, ఖండేందు తిలక లలాటాయ నమః
౩౫ ,, ఖలఘ్నే నమః
౩౬ ,, గణాధ్యక్షాయ నమః
౩౭ ,, గంగాసుతాయ నమః
౩౮ ,, గంభీర నినదాయ నమః
౩౯ ,, గజ ముఖాంబుజాయ నమః
౪౦ ,, గణాధిపతయేనమః
౪౧ ,, గజాననాయనమః
౪౨ ,, గంధర్వాప్సరస గణ సేవితాయ నమః
౪౩ ,, ఘోరదానవ మర్దనాయనమః
౪౪ ,, ఘనసంపత్ప్రదాయనమః
౪౫ ,, జ్ఞానహృత్కమల నిలయాయనమః
౪౬ ,, చతుర్భుజాయనమః
౪౭ ,, చంద్రగర్వాప హారిణేనమః
౪౮ ,, చిత్స్వరూపాయనమః
౪౯ ,, ఛిద్రోపద్రవ భేదనాయనమః
౫౦ ,, జన్మమృత్యుజరారోగ రహితాయనమః
౫౧ ,, జగదాధారాయనమః
౫౨ ,, జితేంద్రియాయనమః
౫౩ ,, జిష్ణవేనమః

౫౪ ,, జగత్త్రయ హితాయనమః
౫౫ ,, జ్వలన్మాణిక్యకుండల ధరాయనమః
౫౬ ,, ఝల్లకీవాద్య కౌశలాయనమః
౫౭ ,, ఝుంఝూమారుత జ్ఞానగమనాయనమః
౫౮ ,, జ్ఞానానంద మయస్వరూపాయనమః
౫౯ ,, టంకబాణ సమాయుక్తాయనమః
౬౦ ఓం టంకీగుణకృత ఘోషాయనమః
౬౧ ,, ఠంకారశబ్ద సిద్ధాయనమః
౬౨ ,, డాకినీ శాకినీగణ నిర్మూలనాయనమః
౬౩ ,, ఢక్కాకర కమలాయనమః
౬౪ , నిత్యజ్ఞానానంద మయాయనమః
౬౫ ,, తరుణాదిత్య సహస్రమండల విభాసినే నమః
౬౬ ,, త్రికాలజ్ఞాన సంపన్నాయనమః
౬౭ ,, త్రిలోచనాయనమః
౬౮ ,, తంత్ర మంత్ర యంత్ర విశేషజ్ఞానాయనమః
౬౯ ,, తుహినాచల శిఖర నివాసినే నమః
౭౦ ,, త్ర్యంబకాయనమః
౭౧ ,, తాటకాసురభంజనాయనమః
౭౨ ,, దారిద్ర్యవిధ్వంసనాయనమః
౭౩ ,, దామోదర ప్రియాయనమః
౭౪ ,, దేవదైత్య యక్షకిన్నరగణ సేవితపాద పద్మాయనమః
౭౫ ,, దానవ కులోన్మూలనాయనమః
౭౬ ,, దీన జనకుముద కుముద బాంధవాయనమః
౭౭ ,, ధనుర్వేదనిపుణ ధురంధరాయనమః

౭౮ ,, ధర్మజన పక్షపాతాయనమః
౭౯ ,, నాగయజ్ఞోప వీతాయనమః
౮౦ ,, నిరంజనాయ నమః
౮౧ ఓం నారాయణ ప్రియాయ నమః
౮౨ ,, నాదబిందుకళా తీతాయ నమః
౮౩ ,, పరమోదారాయ నమః
౮౪ ,, పంచమహా పాతకాంతకాయ నమః
౮౫ ,, పరబ్రహ్మ స్వరూపాయ నమః
౮౬ ,, పురాణ పుణ్యపురుషాయ నమః
౮౭ ,, పరమాహ్లాద కారణ పవిత్ర నామామృతాయ నమః
౮౮ ,, ఫణీంద్ర భూషణ భూషితాయ నమః
౮౯ ,, బాలభానుసహస్రకోటిసదృశమహోజ్వలాంగాయనమః
౯౦ ,, బిల్వదళ ప్రభూషిత సర్వాంగాయ నమః
౯౧ ,, బడబానల మహానేత్రాయ నమః
౯౨ ,, భవబంధ విమోచనాయ నమః
౯౩ ,, భుజంగ రాడ్వలయ మహోదరాయ నమః
౯౪ ,, మందార కుసుమార్చితాయ నమః
౯౫ ,, మహాబల వీర పుణ్యపురుష సింహాయ నమః
౯౬ ,, యాతుధాన భయంకర రూపాయ నమః
౯౭ ,, రత్న మణిమయ సింహాసనాయనమః
౯౮ ,, రజతాచల శృంగాగ్ర నిలయాయ నమః
౯౯ ,, లంబోదరాయ నమః
౧౦౦ ఓం లీలాకల్పిత బ్రహ్మాండ మండలాయనమః
౧౦౧ ,, వక్రతుండాయనమః

౧౦౨ ,, వరలక్ష్మీ స్మహృద్వారాంభోజ స్థితమధుకరాయనమః
౧౦౩ ,, శాశ్వతానంద సుధాయకాయ నమః
౧౦౪ ,, షణ్ముఖ ప్రియానుజాయనమః
౧౦౫ ,, సర్వైశ్వర్య ప్రదభక్తలోకాయనమః
౧౦౬ ,, సకలలోక భక్తముక్తి ప్రదాయకాయనమః
౧౦౭ ,, హేరంబాయనమః
౧౦౮ ,, క్షీరాభిషేక మహానందాయనమః

శ్రీమహా వరసిద్ధి వినాయక దేవతాయైనమః

శ్రీవర...యైనమః నానావిధ పరిమళపత్ర పుష్పాక్షతాన్ సమర్పయామి

శ్లో॥ దశాంగంగుగ్గులోపేతం । సుగంధి సుమనోహరం ।
ఉమాసుత నమస్తుభ్యం । గృహాణవరదోభవ ॥ 12

శ్రీవర...యైనమః ధూపమాఘ్రాపయామి

శ్లో॥ సాజ్యంత్రివర్తి సంయుక్తం । వహ్నినాద్యోతితంమయా ।
గృహాణమంగళందీప । మీశపుత్ర నమోస్తుతే ॥ 13

శ్రీ వర...యైనమః దీపందర్శయామి

ధూపదీపానంతరమాచమనీయం సమర్పయామి.

శ్లో॥ సుగంధాన్సుకృతాంశ్చైవ । మోదకాన్గృహపాచితాన్
నైవేద్యం గృహ్యతాన్ దేవచణముద్గైః ప్రకల్పితాన్॥ 14

అవసరనైవేద్యం సమర్పయామి.

శ్లో॥ భక్ష్యం భోజ్యంచలేహ్యంచ । చోష్యం పానీయమేవచ
ఇదం గృహాణనైవేద్యం । మయాదత్తం వినాయక॥

మహానైవేద్యం సమర్పయామి.

అమృతమస్తు. అమృతోపస్తరణమసి ఓం ప్రాణాయ
స్వాహా, ఓం అపానాయస్వాహా, ఓం వ్యానాయస్వాహా, ఓం
ఉదానాయస్వాహా, ఓం సమానాయస్వాహా, మధ్యే మధ్యే
పానీయం సమర్పయామి, అమృతాపిధానమసి ఉత్తరాపోశనం
సమర్పయామి, హస్తౌ ప్రక్షాళయామి, పాదౌ ప్రక్షాళయామి.
శుద్ధాచమనీయం సమర్పయామి

శ్లో॥ పూగీఫలైస్సమాయుక్తం నాగవల్లీదళైర్యుతం
కర్పూరచూర్ణసంయుక్తం। తాంబూలం ప్రతిగృహ్యతాం॥
శ్రీవర......యైనమః తాంబూలం సమర్పయామి.

శ్లో॥ ఘృతవర్తిసహస్రైశ్చ। కర్పూరశకలైస్తథా।
నీరాజనం మయాదత్తం। గృహాణవరదోభవ॥ 16
శ్రీవర...యైనమః నీరాజనం దర్శయామి.
నీరాజనానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి.

శ్లో॥ సదానంద విఘ్నేశ। పుష్కలానిధనానిచ।
భూమ్యాంస్థితాని భగవన్। స్వీకురుష్వ వినాయక॥
శ్రీవర...యైనమః సువర్ణదివ్య మంత్రపుష్పం సమర్ప
యామి। ఆత్మప్రదక్షిణ నమస్కారం సమర్పయామి॥

శ్లో॥ మంత్రహీనం క్రియాహీనం ॥ భక్తిహీనం వినాయక।
యత్పూజితం మయాదేవ। పరిపూర్ణం తదస్తుతే.
అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజయాచ
భగవాన్ సర్వాత్మకః ఏతత్ఫలమ్ శ్రీవరసిద్ధి వినాయక
దేవతాసు ప్రీత స్సుప్రసన్నో వరదో భవత్.
శ్రీవరసిద్ధి వినాయక దేవతాప్రసాదం శిరసాగృహ్ణామి
ఏతత్ఫలమ్ శ్రీ పరమేశ్వరార్పణమస్తు.

ఓమ్.

శ్రీరస్తు.

శ్రీ మహాగణాధిపతయే నమః.

# వినాయక శతకము

అను

శ్యమంతకోపాఖ్యానమందు

## శ్రీ వినాయక నక్షత్రమాల.

ఉ॥ శ్రీ మదనంతకోటి గుణ ♦ సేవిత చిన్మయ దివ్యతేజ! ము
ఖ్యామర సన్నుతామల యు ♦ గాంఘ్రిసరోజ! సమస్తభక్త స
త్కామద కల్పభూజ! గిరి ♦ కాంతుతనూజ తనూజ! నిన్ను హృ
త్సీమను నిల్పికొల్తు; వర ♦ సిద్ధి వినాయక భక్తపాలకా॥ ౧

చ॥ కిరమనురక్తి పద్య శత ♦ కంబును జెప్ప మదిందలంచి, నీ
వరపద పంకజద్వయము ♦ పై, భరముంచితిగాన ప్రేమతో
సురుచిర శబ్దజాలములు ♦ శోభిలునట్లు వరంబొసంగు మా
స్థిరచర భూతనాథ! వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౨

ఉ॥ దంతము, శూర్పకర్ణములు ♦ దాసజనాభయదత్తహస్తమున్
సంతత భక్తరక్షణ వి ♦ శాలకృపామయ హృత్సరోజమున్
దంతిముఖాంబుజంబు, కనుఁ ♦ దమ్ముల్లోకింతెఁ దలంచినంత దు
శ్చింతలణంగఁగాదె? వర ♦ సిద్ధి వినాయక భక్తపాలకా॥

చ॥ తొలుత నవిఘ్నమస్తనుచుఁ ♦ దోఁ ప్రభక్తిని నొక్కసారి నిం
గొలిచెడివారి కార్యములు ♦ కూర్మిని సత్ఫలమందుచుండ, ని

న్నిలఁగృతినాథుఁజేసి, రచి♦యించెడి గ్రంథమఖండరూపమై
చెలఁగుట వింతయా నె? వర♦సిద్ధివినాయక భక్తపాలకా॥ ౪

ఉ॥ నీనగుమోము చంద్రికలు♦నేర్పునభక్త జనాపదాంధమున్
మానిచి, సౌఖ్యసంపదల♦మందగతిన్ దయసేయుచుండఁగాఁ
గానక, నన్యదైవపద ♦ కంజములంటుట వెఱ్ఱిగాదొకో?
శ్రీ నగజా తనూజ! వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౫

చ॥ చదువులకెల్లనొజ్జవఁట ♦ సాధుజనాళిభయంబుఁ దీర్చు, స
త్సదయుఁడవంట, లేగరిక ♦ దాసులొసంగిన మెత్తువంట, ని
న్నదమల వృత్తిఁగొల్చుటది♦నాదుతపః ఫలసిద్ధిగాదె! యో
చిదమల దివ్యకాయ! వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౬

ఉ॥ సిద్ధులు యక్షకిన్నరు ల ♦ శేషసురాసుర సాధ్యులెల్ల సం
బద్ధమనస్కులయ్యు నిను♦భక్తినిగొల్వక సర్వకార్య సం
సిద్ధిని బొందఁజాలుదురె ♦ చిత్రము నీదుమహత్వమెన్న వా
క్సిద్ధినొసంగుమయ్య వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౭

చ॥ నినుమదిఁగొల్చుదాసులిల♦నిక్కమురక్తియు భుక్తిముక్తులం
గనుదురు వారలెప్పుడును♦గర్మముసంటకఁ బావనాంగులై
మనుదురుసర్వభూతముల♦మాన్యులునౌదురునీవు ప్రేమఁగా
చినఁగొఱ కెద్దిలేదు; వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౮

ఉ॥ కారణ కారణుండవు జ♦గత్పరిపాలన కర్తవైన నిన్
సారససంభవాది సుర♦సంఘము సన్నుతిఁ జేయలేనిచో
నారయ మూర్ఖచిత్తుఁడ ని♦రక్షరకుక్షిని నైన నేను నిం
జేరి నుతించుటెట్లు? వర♦సిద్ధివినాయక భక్తపాలకా॥ ౯

చ॥ ధనమునొసంగ విద్యలను ♦ దానమొనర్పగ సర్వకోటికల్
ఘనతనిడంగ సత్ప్రభువ♦ఖండ మహాత్ముడ వీవయుండఁగాఁ
గనుఁగొనలేకమూర్ఖతను♦గాలముఁ బుచ్చుట నెట్టికాదె? కొ
ల్చిననినె కొల్వనొను వర♦సిద్ధివినాయక భక్తపాలకా॥ ౧౦

ఉ॥ దాసుఁడనేనుఁగానొ? దయఁ♦దాల్చిన దేవుఁడవీవుగావొకో
నీసములెవ్వరీధరణి ♦ నేర్పరులెవ్వరు నన్నుఁగావ, నా
యాసనురిత్తఁబుచ్చక ర ♦ యంబున సత్కృపఁజల్లి ప్రేమ నా
శీసులొసంగుమయ్య, వర ♦ సిద్ధివినాయకభక్తపాలకా॥ ౧౧

చ॥ సుతులను మిత్రవర్గమును ♦ జుట్టములన్ సతులందలంచి, స
ద్గతిఁ జెడఁగొట్టుకొంటిఁగద ♦ కాయము మాయము కొన్ని నాళ్ళకున్
గతినిడువాఁడెవాఁడపుడు♦కానకఁద్రుళ్లి త్రొక్కుచుంటిఁగా
చితిననవే కృపాబ్ధి వర ♦ విద్ధివినాయక భక్తపాలకా॥ ౧౨

ఉ॥ సారవిహీనమై, కలుష ♦ సాగరమై, ఫలశూన్యమై సదా
చార నిరోధమై, ఘనవి ♦ చారపరం పరవాసమైన సం
సారము నందుమున్గి తను ♦ శక్తిని బుద్ధిని గోలుపోయి, నిం
జేరితిఁ గావుమయ్య, వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౧౩

చ॥ కవనముఁ జెప్పినంతనె, సు ♦ ఖంబుగ గీతముఁ బాడినంతనే
సవనమొనర్చినంత, నని ♦ శంబును భోగములందినంత, నీ
నవకరుణాసుపాత్రుఁడగు ♦ నా? స్థిరభక్తి రవంత లేనిచో
శివతనయా! మహేశ వర ♦ సిద్ధివినాయకభక్తపాలకా॥ ౧౪

ఉ॥ కూరిమిస్వాతిచిన్కులను ♦ గోరెడిముత్తెపుఁ జిప్పరీతి, సం
సారభయాగ్నినిం దవిలి ♦ సాంతముతప్తము నైన చిత్తమీ
పారిభవత్కృపామృతర ♦ సంబున కైతపియించుచుండెనో
శ్రీ రమణీయరూప, వర ♦ సిద్ధి వినాయకభక్తపాలకా॥ ౧౫

ఉ॥ దక్షుఁడనంచు, దాసుల ను ♦ దారతనేలెడి వేల్పవంచు, నీ
రక్షణఁగల్గువా రిహాప ♦ రంబుల భోగములందునంచు, నా
వక్షమునందలంచి కొలు ♦ వం దలకొంటి సుబుద్ధినిమ్ము నీ
శిక్షనొసంగినాకు వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౧౬

చ॥ ఘనులు పురాణదంపతుల ♦ గాదిలిపుత్త్రుఁడవీవు దివ్యశో
భనమయ ధీవిశాలుఁడవు ♦ భవ్యచరిత్రుఁడ వష్టసిద్ధులం
గనిన మహానుభావుఁడ వ ♦ ఖండుడ వక్షయమూర్తి వైన నిం
జెనటు లెఱుంగలేరు వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౧౭

ఉ॥ కన్నుల నద్దుకొందుపద ♦ కంజయుగంబుఁ బవిత్త్రనామమున్
మన్ననతో జపింతు నను ♦ మానసముమాని జగంబులందు నీ
కన్నమహాత్ము లెందుసరిఁ ♦ గారని చాటుదు నింకఁ బ్రోవు మీ
చెన్నుగఁ జేరఁదీసి వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౧౮

ఉ॥ తప్పుశమింపుమన్న కడు ♦ దైన్యతఁ బాదములంటితన్న నీ
గొప్పతనంబుమానుటది ♦ కూడదటన్న కృపామయుత్వమే
యొప్పగుసొమ్మటన్న కని ♦ యోర్పునఁగాచుట కంత రాయముం
జెప్పకుమన్న దేవ వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౧౯

చ॥ ఫణిపతివంకరయ్యెను ది ♦ వస్పతిపూర్ణకళంకియయ్యె నా
ధనపతి రోగియయ్యెహిమ ♦ ధాముఁడుషోడశభాగలయ్యె శ్రీ

తనయుఁ డనంగఁ డయ్యెను వి♦ధాత యపూజితుఁడయ్యె నిన్నుఁ గొ
ల్చిన నివి కల్గునొక్కొ వర♦సిద్ధివినాయక భక్తపాలకా॥ ౨౦

ఉ॥ గాలినిమేయ నేమి త్రిజ♦గంబులు పాలనసేయ నేమి వా
గ్జాలనుమోయ నేమి బహు♦భంగులఁ దీక్షనుఁగాయ నేమినీ
లీలలెఱుంగు వారలిఁక ♦ లేరని వాదనసేయవచ్చు ల
క్ష్మీలలనా మణీశ! వర♦సిద్ధి వినాయక భక్తపాలకా॥ ౨౧

చ॥ కుసుమములు గారె లుండ్రములు ♦ కోరినబూరెలు లడ్డు లావడల్
ఫలములు నారికేళములు ♦ పాయసముం గడుపార మెక్కి భ
క్తుల కతి భోగభాగ్యములఁ♦గూర్చెద వింతటిదాత లేరి గా
సిలి వెదుకంగనెందు వర♦సిద్ధివినాయక భక్తపాలకా॥ ౨౨

ఉ॥ సాదరమొప్పగా భువన ♦ సంఘముబొజ్జనునిల్పి నిందు స
మ్మోదముతోఁడ బ్రోచుభర ♦ ముంగలశక్తి నెఱుంగ లేక లం
బోదరుఁడంచున వ్వెదరు♦హా! మతిమాలినదుర్జనుల్ గటా
క్షీద, శివాతనూజ! వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౨౩

చ॥ అతిశయిపాపపుంజము ల♦నంతములయ్యెభవంబె నమ్మిమా
నితి నినుపూజసేయుటలు ♦ నిర్మలచిత్తముఁ గాంచనైతిగా
గతజల సేతుబంధనము ♦ కాదె? గతంబుఁదలంపఁగావు మా
శ్రితజనపక్షపాత! వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౨౪

ఉ॥ ఎంచఁగ్రమపారసంబును సృ♦జించిన తండ్రివి తద్రసంబు నూ
హించి వచించి నేర్పవలె ♦ నే భరియించిజగంబులెన్నొ పా

లించెదీ దొడ్డదేవుఁడ వో♦కింత కృపారస మున్నొసంగి ర
క్షించుట భారమా నె? వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥

ఉ॥ పావనుఁడయ్యె మద్భవము ♦ పాపమహాటవిభస్మమయ్యెనా
జీవితమింక ధన్యతను ♦ జెందె, విషాదము శాంతమొందె నీ
పావన దివ్యనామమును ♦ భావమునం దలపోయుటన్, జగ
జ్జీవన పుణ్యరూప వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౯౬

చ॥ హరిహర శబ్దమీవ యసు♦ వాత్మభవామృత చంద్రసూర్య ది
గ్వరగణ తారకానిచయ ♦ కాలవసుంధర పుష్కరాబ్ధి, భూ
ధరచయులోకమీవె! శమ♦ధైర్యగుణక్షణలక్ష్యమీవె? సు
స్థిరచర భూతనాథ! వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౯౭

ఉ॥ చంపక లుత్పలంబులను ♦ చక్కనితారక రత్నహారమున్
సొంపుగఁ గూర్చి తెచ్చితిని ♦ శోభిల నీగళమందుఁ దాల్చి దీ
వింపుమ నన్ను, భక్తిఘన ♦ మేర్పడునట్లుగఁ జేసి, ప్రేమ ర
క్షింపుమ సంతతంబు; వర♦సిద్ధివినాయక భక్తపాలకా॥ ౯౮

స మా ప్త ము.

## కథాప్రారంభము.

ఉ॥ శ్రీ శశిశేఖరుండు సుర ♦ సేవితుఁడై మునికోటిఁగూడి భా
స్వాశయమూర్తి భాద్రపద ♦ మందున శుద్ధచతుర్థినాడు కై
లాస మహాగిరిం దగ వి ♦ లాసముగా సభఁదీర్చియుండెనో
శ్రీశ శుభప్రదాంగ వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౧

ఉ॥ ఆసుదినంబునందున మ♦హాఫలరాసులు బూరెలుండ్రముల్
దాసులొసంగమెక్కి కడు ♦ తల్లడిలంగ జగంబులెల్ల ను
ల్లాసముతోడ నీవటకు ♦ లంబశరీర విభూతిఁగల్గి వేం
చేసితివయ్య దేవ వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౨

చ॥ మృదులశతనూవిలాసమున ♦ మేటిని నాకిటు సాటిలేరుగా
పదిపయినాల్గులోకముల ♦ భాసురమూర్తినటన్న గర్వదు
ర్మదమున చందురుండు, సుర ♦ రాజువు నిన్నని నవ్వసాగెనో,
చిదమలదివ్యకాయ! వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ 3

ఉ॥ నవ్వెడు చందురుంగనిఘ ♦ నంబగుకోపముఁబూనిహీనుఁడా
నవ్వెదవేల! దుర్మద! వి ♦ నాయకు నన్నెఱుగంగలేవె! నీ
కొవ్వణగింతుఁజూడుమిఁకఁ ♦ గొంపనుగూల్చెదనంచు ధీరతం
జివ్వునఁదిట్టితీవు; వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౪

చ॥ కలుషము నీమొగంబుఁగనఁ ♦ గానికఁజెల్లదు, కాంచు దుర్మతుల్
పలువిధ నిందలందవిలి ♦ పాపులు, భ్రష్టులు నౌదురోరి, నీ

తుబువతనంబు మాయమని ♦ దుర్భరశాప మొసంగితీవ హా
శిలఁ దలఁగొట్టుకేతి, వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా। ౫

శా॥ శాపమునొందిచంద్రుఁడు ♦ చాలవిచారముఁబూని, యక్కటా
పాపపు బుద్ధిచేతనిది ♦ వాటిలె నెవ్వరు దిక్కటంచుఁ బెం
దాపమునొంది, సిగ్గుఁబడి ♦ తాజలజంబున దాగగాఁజనెన్
శ్రీపతి! భక్తపోష! వర ♦ సిద్ధివినాయక! భక్తపాలకా। ౬

శా॥ అంత సుధాకరుండు, చనఁ ♦ గా, సురలెల్లరుఁ దిండిలేక దు
శ్చింతను మున్గి, మర్త్యులక ♦ జేయుము పాపమటంచు నెంచి, య
త్యంతము భక్తితో, హరిహ ♦ రాదిసుపర్వులు నిన్నుఁ జేరి, ని
శ్చింతను గొల్చిరిట్లు; వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౭

ఉ॥ ఓకరుణామయాత్మ! భువ ♦ నోదర! పుణ్యపురాణపూరుషా!
నాక రమాంగనా భయ వి ♦ నాశన! కారణాకారణాధవా!
లోకసుఖప్రదా! దహన ♦ లోచన! సర్వవిభూషితాంక! మా
చీకు నణంపుమయ్య! వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా। ౮

ఉ॥ ఎంచవదేమి మమ్ముఁ గరు ♦ ణించవదేమి దయాబ్ధిమామొఱా
లించవదేమి సత్కరుణ ♦ నింతరయంబునఁ బూనిమమ్ముఁ బా
లించవదేమి మూర్ఖుఁడగుఁ ♦ డింభుని శాపముఁదీర్చి వేఁగ ర
క్షించుమనంగనంత వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౯

చ॥ పరమ సుశాంతమూర్తివయి ♦ పావనమైతివి నీవు రాకచే
సురవరులార! భాద్రపద ♦ శుద్ధచతుర్థినిఁగాక నాతనిన్
నరయఁగవచ్చు నెల్లపుడ ♦ నంగను మేలని సంతసించి రా
సిరిఁగను పేకరీతి వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౧౦

ఉ॥ అప్పటినుండి భాద్రపద ♦ మందున శుక్లచతుర్థి చంద్రునిం
దప్పకఁ జూచువాఁ డమిత ♦ దారుణదుర్యపవాదమంది తా
నొప్పఁగ దుర్యశంబుఁగను ♦ నొక్కనిదర్శనమైన సత్కథం
జెప్పెదఁ జిత్తగింపు వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౧౧

చ॥ దనుజుల పాపకృత్యములు ♦ దారుణమౌటను జింతఁగుందిభూ
వనితభరంబుఁ దీర్పుమని ♦ భక్తిని పాదములాశ్రయింపఁగా
మనమునఁ జాలిఁబూని కడు ♦ మాధవుఁడంతటఁ గృష్ణుఁడై జనిం
చెనుగద గొల్లఁడయ్యు వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౧౨

ఉ॥ శైశవమందె కంసబలుఁ ♦ జంపెనుపూతనగూల్చె దుష్టమాం
సాశనులన్ వధించెను, మ ♦ హాద్రిని నెత్తిజనాళిఁ బ్రోచె, భూ
రాశినిజూపె గర్భమున ♦ రాణియశోదకు, గృష్ణుఁడల్పుడే
శ్రీశుఁడు సుమ్మితండు, వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౧౩

చ॥ పగఁగొని, యాజరాసుతుఁడు ♦ పైగొనిపోరఁగ, శక్తిలేక దా
పగచి, నిజస్థలంబు విడి ♦ పారిన, సబ్ధిని విశ్వకర్మయుం
దగగను ద్వారకాపురము ♦ దాఁతఁగట్టినగృష్ణుఁడందు వా
సిగను నివాసమయ్యె వర ♦ సిద్ధివినాయకభక్తపాలకా ౧౪

ఉ॥ చక్కనిగోపురంబులు వి ♦ శాలవినిర్మల మందిరంబులున్
జక్కనిసుందరంబులగు ♦ మేడలు, మిన్నునుదాకు కోటలుం
బెక్కులవేల? నిక్కముగ ♦ వేయివిధంబుల మర్త్యకోటి కిం
జిక్కనినాక మౌర వర ♦ సిద్ధివినాయకభక్తపాలకా॥ ౧౫

ఉ॥ ఆపురి నుగ్రసేనునకు ♦ నా సతరాజితుఁడుం బ్రసేనుఁడన్
భూపకులాగ్రగణ్యులగు ♦ పుత్రులొకిద్దరుఁ బుట్టిరంత వా

లేపుఁగ విద్యఁజేర్చి యశ ♦ మెల్ల జగంబుల నింపిరయ్య కా
శీపురవాస, యీశ, వర ♦ సిద్ధ వినాయక భక్తపాలకా॥

చ॥ రతిపతిఁబోలువాఁడు సత♦రాజితుఁడెక్కుడు బుద్ధిమంతుఁడై
మతిసరిఁజేసి భక్తిఁగని ♦ మౌనముఁదాల్చి, జపింపసాఁగఁగా
సతిముదమంది భానుఁడెదు♦రై ప్రసన్నుఁడయ్యెఁదపంబుచాలుమె
చ్చితినని పల్కె నిట్లు; వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥౧౭

ఉ॥ భారము నీమనోగతపు ♦ వాంఛ నెఱింగితి భక్తుఁడా! సదా
చారముతో ధరింప, నిది ♦ చాలగ నెన్మిది ఫుట్లుమెత్తు బం
గారమునిచ్చు నేదినము ♦ గైకొనుమంచు స్యమంతసన్మణిం
జేరిచెఁ గంఠమందు, వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥౧౮

చ॥ మణిధరియించి, భక్తినొక ♦ మాఱుఁ బ్రదక్షిణమాచ
రించి, వం
దనమిడి సన్నుతింపఁగనె ♦ తద్దయు నారవి మాయమయ్యె నం
తను, హరితేజమూర్తియయి ♦ దారినిబట్టియు, రాసు
తుండు, వ
చ్చెనుగద కృష్ణుఁజూడ! వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥

చ॥ హరియునువానిఁజేరి, యుచి ♦ తాసనమందున నేఁదదీర్చి స
త్కరుణరసప్రవాహ మన♦గా కుశలంబుల నాదరించి సుం
దరమగు రత్నమిమ్మనిన ♦ దైన్యముతో సతరాజితుండు తా
శిరమునువంచిపల్కె వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥౨౦

ఉ॥ కూరయొ? నారయో? యొరులు♦కోరిననిచ్చుటకిద్ది, కోరు బం
గారమునిచ్చునాని నడు♦గన్ మారియాదమె? కోరనితురే?

ఉ॥ అప్పటినుండి భాద్రపద ♦ మందున శుక్లచతుర్థి చంద్రునిం
దప్పకఁ జూచువాఁడమిత ♦ దారుణదుర్యపవాదమంది తా
నొప్పఁగ దుర్యశంబుఁగను ♦ నొక్కనిదర్శనమైన సత్కథం
జెప్పెదఁ జిత్తగింపు వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౧౧

చ॥ దనుజుల పాపకృత్యములు ♦ దారుణమౌటను జింతఁగుందిభూ
వనితభరంబుఁ దీర్పుమని ♦ భక్తిని పాదములాశ్రయింపఁగా
మనమునఁ జాలిఁబూని కడు ♦ మాధవుఁడంతటఁ గృష్ణుఁడై జనిం
చెనుగద గొల్లఁడయ్యు వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౧౨

ఉ॥ శైశవమందె కంసబలుఁ ♦ జంపెను పూతనఁగూల్చె దుష్టమాం
సాశనులన్ వధించెను, మ ♦ హాద్రిని నెత్తిజనాళిఁ బ్రోచె, భూ
రాశినిజూపె గర్భమున ♦ రాణి యశోదకు, గృష్ణుఁడల్పుడే
శ్రీశుఁడు సుమ్మతండు, వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౧౩

చ॥ పగఁగొని,యాజరాసుతుఁడు ♦ పైగొనిపోరఁగ, శక్తిలేక దా
వగచి, నిజస్థలంబు విడి ♦ పారిన, నబ్ధిని విశ్వకర్మయుం
దగగను ద్వారకాపురము ♦ దారతఁగట్టనగృష్ణుఁడందు వా
సిగను నివాసమయ్యెవర ♦ సిద్ధివినాయకభక్తపాలకా ౧౪

ఉ॥ చక్కనిగోపురంబులు వి ♦ శాలవినిర్మల మందిరంబులున్
చక్కనిసుందరంబులగు ♦ మేడలు, మిన్నునుదాకు కోటలుం
బెక్కులవేల ? నిక్కముగ ♦ వేయివిధంబులమర్త్యకోటి కిం
జిక్కనినాక మౌర వర ♦ సిద్ధివినాయకభక్తపాలకా॥ ౧౫

ఉ॥ ఆపురి నుగ్రసేనునకు ♦ నా సతరాజితుఁడుం బ్రసేనుఁడన్
భూపకులాగ్రగణ్యులగు ♦ పుత్రులొకిద్దరుఁ బుట్టిరంత వా

శేషునకు విద్యఁజేర్చి యశ ♦ మెల్ల జగంబుల నింపిరయ్య కా
శీపురవాస, యీశ, వర ♦ సిద్ధ వినాయక భక్తపాలకా॥

చ॥ రతిపతిఁబోలువాఁడు సత♦రాజితుఁడెక్కుడు బుద్ధిమంతుఁడై
మతిసరిఁజేసి భక్తిఁగని ♦ మౌనముఁదాల్చి, జపింపసాగఁగా
నతిముదమంది భానుఁడెదు♦రై, ప్రశంసయయ్యెఁదపంబుచాలుమె
చ్చితినని పల్కెనిట్లు; వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥౧౭

ఉ॥ భూరిమునీమనోగతపు ♦ వాంఛనెఱింగితి భక్తుఁడా! సదా
చారముతో ధరింప, నిది ♦ చాలగనెన్మిది పుట్లయెత్తు బం
గారమునిచ్చు నేదినము ♦ గైకొనుమంచు స్యమంతసన్మణిం
జేరిచెఁ గంఠమందు, వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥౧౮

చ॥ మణిధరియించి, భక్తినొక ♦ మాఱుఁ బ్రదక్షిణమాచ
రించి, వం
దనమిడి సన్నుతింపఁగనె ♦ తద్దయు నారవి మాయమయ్యెనం
తను, వారి తేజమూర్తియయి ♦ దారినిఁబట్టియు, రాను
తుండు, వ
చ్చెనుగద కృష్ణుఁజూడ! వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥

చ॥ హరియునువానిఁజేరి, యుచి ♦ తాసనమందునసేఁదదీర్చి స
త్కరుణరసప్రవాహ మనఁ♦గా కుశలంబుల నాదరించి సుం
దరమగు రత్నమిమ్మనిన ♦ దైన్యముతో సతరాజితుండు తా
శిరమునువంచిపల్కె వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥౨౦

ఉ॥ కూరయొ? నారయొ? యొరులు♦కోరిననిచ్చుటకిద్ది, కోరు బం
గారమునిచ్చుదాని నడు♦గన్ మరియాదయె? కోరనిత్తురే?

ఊరక వెఱ్ఱివెతివని ♦ యుండని కేమొ? యటంచు నెంచి, తా
జేరెను స్వస్థలంబు; వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౨౧

ఉ॥ మంచితనంబు లేదుకద ♦ మాధవుఁ డెంతటి దుష్టచిత్తుఁడో!
కించితు గౌరవంబుఁ గన ♦ కే కను దానిని కోరవచ్చునే.
వంచెనకగ్గెఁ గృష్ణుఁడక ♦ హా! బలుఁ డాతఁడ దెట్లో యంచు రో
షించియుఁ దమ్ముఁ బిల్చి; వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥

చ॥ అనుజ! ప్రసేనకంటివె మ♦హారతనంబిది సూర్యదత్తమాఁ
గనక మొసంగుసుమ్ము శుచిఁ♦గల్గిధరింపఁగ నౌనటంచుఁ దా
ననుజుని కంఠసీమనిడి ♦ యంతయు సత్యముఁ జెప్పెఁ
గృష్ణుఁ జూ
చిన గతి ప్రేమమీర వర♦సిద్ధివినాయక భక్తపాలకా॥ ౨౩

ఉ॥ అంతఁ బ్రసేనుఁ డొక్కదిన♦మందున నామణిఁ దాల్చి కానలోఁ
జంతువులన్ వధింప నతి ♦ సాహసవృత్తిఁ జరించుచుండఁగాఁ
బంతముతోడ సింగమొక♦పాటునఁ బైఁబడి చంపి రత్నమున్
వింతగఁ బట్టియేగు హరి♦పీనుని గూల్చిన జాంబవంతుఁడుం
జింతనుమాని చూచె వర♦సిద్ధివినాయక భక్తపాలకా॥ ౨౪

చ॥ రతనము జాంబవంతునకు♦ రమ్యమహోత్సవమబ్బఁ జేయఁగా
నతిరయమొప్ప కాఁగొని ♦ యాతని గేహముఁ జొచ్చి
చందురున్
గతి వెలుఁగొందు బాలునకుఁ ♦ గన్నుల పండువుఁ గాగఁ
గందుకో
చితముగఁ జేసెనంత వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౨౫

ఉ॥ ఏటికి వేటకే గినటు ♦ నెన్నిదినాంబులయ్యెఁ దమ్ముఁడీ
నాటికి రాకయుంట తగు ♦ నా మతిమాలిన పాపదైవమే
మాటలిఖించినాడో ప్రతి ♦ మాటకు మీఱెటిశీ వామనేత్రమా
చేటునుగోరుచుండె వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౨౬

చ॥ కటకట! విత్తలోభమునఁ ♦ గానక కృష్ణుఁడ దొంగఁ జేసె, దు
ర్ఘటముకదా, తలంపఁగఁగ ♦ రాతుఁడ తండువధించియుండుఁగా
కటవినటంచుఁ బెక్కుగతు ♦ లా సత్రాజితుఁ డేడ్చెఁ జింతచేఁ
జిటచిట మేచుమండ; వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౨౭

ఉ॥ చూచితిరే? ప్రసేనుగతి ♦ శుద్ధకిరాతుఁడు కృష్ణుడన్న, నా
నీచుని విష్ణుదేవుఁడని ♦ నేర్పునఁ గొల్తురు పాపమంచుఁ దాఁ
జూచినవారికెల్లఁ బెను ♦ శోకభరంబునఁ జాలెఁబూరుషుల్
స్త్రీచయమున్ వినంగ; వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౨౮

చ॥ కలజములెల్లఁ జెప్పుకొను ♦ కల్లను హార్తను నాలకించి, ని
శ్చలముగఁ గొంతసేపు మది ♦ చాలవిచారముఁ బూని, కీర్తికిం
గలిగెను మచ్చటంచును న ♦ గారిగ యోచనఁ జేసె కృష్ణుఁడా
శిలగతినయ్యె; దేవ! వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౨౯

ఉ॥ నాయెడఁ దప్పులేమికద ♦ నా మమె? మర్యశమెట్టిదబ్బగా,
నీ యుపవాయుద మెట్లగుఁ? ♦ నెవ్విధి సత్యముఁ దోమఁ? బుర్వులన్
మోయుశిరంబుకట్టెలమ ♦ మోయఁగనయ్యెను, జన్మఫలమ? ని
స్సీయుని చింతఁగుందె; వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౩౦

చ॥ జలవిధి యెంతవానికి న ♦ వశ్యము భోజ్యముఁ గాకఁ దప్పునే
తొలఁగదు చింతచేతనది ♦ దుర్భరమాటయొకాని, సత్యముం
దెలసి, వచింపదుర్యశము ♦ తీరునటంచును ధైర్యశాలియై
చెలఁగెను కృష్ణుఁడంతవర ♦ సిద్ధివినాయకభక్తపాలకా॥ 3౧

చ॥ వరకవచాంగుఁడై సుభట ♦ వర్గంబలుండయి చక్రధారుఁడై
ఖరకరతీక్ష్ణతేజుఁడయి ♦ గర్వమదాసురభంజనుండునై
పురమునువీడి, ఘోరమృగ ♦ పూర్ణభయంకరదుర్గమాటవిం
జెరఁజెరఁ జొచ్చెనయ్య వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥

ఉ॥ ఆవనమార్గమధ్యమునను ♦ శ్వాసమేతముగాఁ బ్రసేన స
ద్భావరుఁ జంపినట్టి హరి ♦ మూర్తినిగూల్చిన భల్లుజాడకై
పోవఁగఁబోవఁగా నొకట ♦ భూరిభయంకరమౌ బిలంబున్
శ్రీవరుఁడట్టెచూచె వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ 33

చ॥ ముదమున భల్లుకేశ్వరుఁడు ♦ పోయినజాడనుగుర్తెరింగి, స
మ్మదమునఁ దద్బిలాభిముఖము ♦ భూమిసి సర్వభటాళినుంచి తా
వదిలముగా జనంగ నట ♦ భాసురసౌధమునొండుఁ గాంచుచో
వెడలెను కన్నులంత వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ 3౪

ఉ॥ సుందరసౌధమందు నొక ♦ చోటను బాలుని స్వర్ణడోలికం
గందుకకేళిగా నెదుటఁ ♦ గట్టిన రత్నము నేత్రపర్వమై
పొందుగఁ గానుపింపఁగనిపొంగి ♦ రయంబున మిన్నుఁదాకి మె
చ్చెందగఁ గృష్ణుఁడంత వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ 3౫

ఉ॥ మెల్లఁగఁజేరి డోలికను ♦ మేలుగ నాటలనాడు బాలునిం
జల్లఁగఁజూచి ముద్దులనొ ♦ సంగియుఁ బ్రీతిని, గారవించుచో

భల్లుక నాథుపుత్రియగు ♦ భాసురగాత్రి యొకర్తువచ్చి రం
జిల్లఁగఁ గృష్ణుఁజూచె వర♦సిద్ధివినాయక భక్తపాలకా॥ ౩౬

ఉ॥ చక్కనిచుక్క యారమణి♦శౌరినిఁగాంచి పయింబసిద్ధమున్
మిక్కిలి ప్రేమతోడఁగని ♦ మెల్లగముత్తెములొల్కునట్లుగాఁ
జక్కలురాలెనో యనఁగ ♦ సూక్తులు పల్కెను లేతనవ్వులుం
జెక్కులఁ దాండవింప వర♦సిద్ధివినాయక భక్తపాలకా॥ ౩౭

చ॥ అనుపమసుందరాంగ తగు♦నా తరుణాంగనలున్న సౌధమం
దునఁజొరఁగా ఘనంబగునె♦తుంటరివంచుమహాసింపరొక్కనా
జనకు నెఱుంగవే యతఁడ♦సాధ్యుఁడుసుమ్ము త్రోలంగవేని నిం
జెనకు సతండటన్న వర♦సిద్ధివినాయక భక్తపాలకా॥ ౩౮

ఉ॥ ఆసుకుమారి పల్కులకు♦నాసుకుమారవరుండు నవ్వి, యో
భాసురగాత్రి నీదయకుఁ ♦ బాత్రుఁడనైతిని, నీదుతండ్రి భ
ల్లేశు నెఱుంగువాఁడ, భయ♦మింతయు లేదని శంఖనాదముం
జేసెను చక్రియంత; వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౩౯

చ॥ అదివిని జాంబవంతుఁ డక♦టా! యిది యెవ్వని శంఖనాద మం
చెదఁ గడువింతఁజెంది గుహ ♦ నెవ్వఁడొ? చొచ్చె
నటంచు నెంచి తా
గదనొక దానిఁ బూనియొక♦గంతునఁ బైఁబడవచ్చి గుండెలుం
జెదరఁగఁ బొబ్బ వెట్టె; వర♦సిద్ధివినాయక భక్తపాలకా॥ ౪౦

ఉ॥ ఓరిమదాంధ! నీవెవఁడ ♦ వోరిదురాత్మ! మదీయగేహమున్
దూరితి వెందుఁబోఁగలవు ♦ దొంగవొ? జారుఁడవో?
వచింపుమా

పోరున నిన్నుఁ గూల్తు నిఁకఁ ♦ బొల్పుగ సత్యముఁ జెప్పవేవి, నిం
జేరును మృత్యువన్న; వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౪౧

చ॥ వదరెద వేల? మూర్ఖుఁడ! వి ♦ వాదముతోఁ బనిలేదు, దొంగనై
కదియఁగ రాను, జారుఁడను ♦ గాను నిజంబు, వృథాపవాదముల్
వదలఁగఁ గోరివచ్చితిని ♦ భానుగ రత్నము నిమ్ము; సన్నుతిం
చెదనినునమ్ముమన్న; వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౪౨

చ॥ అనివిని జాంబవంతుఁడపు ♦ డాతలఁ ద్రొక్కిన త్రాచు పోల్కి లే
చి, నయనముల్ మహానలముఁ ♦ జిమ్మ భయంకర కాలమూర్తియై
ఘనమదపూరితాంగుఁడయి ♦ కన్నులుఁగానక శౌరిపైకి వ
చ్చినటపోరుసాఁగె; వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౪౩

ఉ॥ పౌరులు తద్బిలాభిముఖ ♦ పద్మమునన్ దినసప్తకంబు, వెం
గూరిమినుండియంతకును ♦ దోపరిపాలుఁడు రాకయుంట చే
వారలుచింతఁగుంది. మన ♦ వాఁడు మృతింగనెనంచు నెంచియుం
జేరిరి పట్టణంబు; వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౪౪

చ॥ అరెరె! కృపాపామయుండగు, మ ♦ హాత్ముఁడు కృష్ణుఁడు పోయెనింక, నీ
పురముచుగాల్పనే? మనము ♦ మొద్దులమై బ్రతుకంగ నేల త
ద్వరగుహ చెంతఁజావకను ♦ వచ్చితిమంచును వెక్కివెక్కి యే
డ్చిరి పురవాసులెల్ల వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౪౫

చ॥ ఇరువదియేడువాసరము ♦ లెంతయువైరము తోడఁబోరి దు
ర్భరముగుకష్టమంది, జయ ♦ భాగ్యముఁగానకభల్లుకుండు ని
బ్బరమగుజ్ఞానమూని, తన ♦ స్వామిగఁగృష్ణునెఱింగి, భక్తిచే
శిరమునువంచి మ్రొక్కె; వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥

ఉ॥ పాలక ! లోకనాయక, కృ ♦ పామయపాలిత భక్తలోక ని
లీలలసన్నుతింపఁగ, ని ♦ లింపుల శక్యమె, కల్మషుండ దు
శ్శీలతఁ బాపకృత్యమును ♦ జేసితి రక్షణఁ జేయుమంచు, స
చ్ఛీలతఁ బల్కెసిట్లు వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౮౭

చ॥ దనుజులఁగూల్చివాలినొక ♦ దారుణబాణముచే వధించి యు
వ్వాన చరఁవీరుగాచి వడి ♦ వార్ధికి సేతువుఁగట్టి రావణున్
దునిమియు సీతఁగొన్నఘన ♦ కోర్బలరాముఁడ వీవుఁగావె నే
శెనటుఁడఁ గావుమన్న వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥

ఉ॥ నావినికృష్ణదేవుఁడును ♦ నవ్యకృపామృతవృష్టిజల్లి స
ద్భావముసీకుఁగల్గెఁగద ♦ తప్పులు లేవిక రత్నమిమ్ము దు
ర్భావ జనంబుచే ఘనత ♦ రంబగు దుర్యశమబ్బె నాకనన్
శ్రీవరదాస పోష వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౮౯

ఉ॥ భల్లుకనాథుఁ డుల్లమున ♦ బాగనిమాధవుపావనాఘ్రిలం
బల్లెరమందునంగడిగి ♦ భక్తిని తజ్జలమున్ ధరించి తాఁ
బిల్లనుధారవోసి కడు ♦ వేడుక రత్నముఁ గాన్కనీయ రం
జిల్లెను గృష్ణుఁడంత వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౯౦

చ॥ కడునుకుమారి జాంబవతి ♦ కన్యనుగూడి మహానురక్తుఁడై
వడివడిఁదాఁ బురంబునకు ♦ వచ్చినఁ గన్గొని పౌరులందరుం

దడయుక నుత్సవంబుఁ గనుఁ ♦ దమ్ములపాదువుఁగాగఁ జేసిరా
చెడుతొలఁగఁగనాడు, వ ♦ రసిద్ధి వినాయక భక్తపాలకా॥౯౦

చ॥ ఘనసభనొందుఁ దీర్చి, వడి ♦ గా సతరాజితుఁ బిల్వనంపి వ
చ్చినఁ గని చక్రిసత్యమును ♦ జెప్పిశమంత మొసంగనందితా
ననుజుని చాపుకన్నఁబర ♦ మాత్ముని దుష్టములాడితిం గటా
చెనటి నటంచు నేడ్చె వర ♦ సిద్ధి వినాయక భక్తపాలకా॥

ఉ॥ పాపుల పాపరాసులను ♦ భస్మముఁ జేయుమహాత్మునాము నే
బాపను మోపినాడనిఁకఁ ♦ బాపమువీడమునన్నుఁ గాన నా
పాపను రత్నమునొసఁగి ♦ పాదములంటుటయే సమస్త ని
క్షేపమటంచు నెంచె వర ♦ సిద్ధి వినాయక భక్తపాలకా॥

ఉ॥ మిత్రుల బంధులంబిలిచి ♦ మేలుగనా సతరాజితుండు, స
త్పుత్రికసత్యభామను, య ♦ థోచితసత్క్రియతోడనంద రా
ట్పుత్రునకిచ్చి పెండిలిని ♦ భూరిశుభంబుగఁ జేసెనప్పు డా
చిత్రముఁ గాంచనౌను, వర ♦ సిద్ధివినాయకభక్తపాలకా॥౯౩

చ॥ సుతనిడి వేడ్కఁ గట్నముగ ♦ శుభ్రశమంతము నీయఁబోవ స
మ్మతమున దానిఁ గైకొనక ♦ మామరో నాకిది యేలకన్యకా
రతనముచాలునన్న మది ♦ రంజిలి యాసతరాజితుండు సు
స్థితి మణిఁ దాల్చెనంత వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥౯౪

ఉ॥ చక్కనిసత్యభామకును ♦ సాటియె సృష్టిని నెందు గాంచినన్
నిక్కమునాకభామినులు ♦ నేరరుపోలఁగఁ గాలిగోటికిన్
నక్కమలాయతాక్షుఁడు న ♦ హర్నిశలాసుకుమారి చేష్టలం
జిక్కిసుఖంచుచుండె వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౯౫

చ॥ పరమ శుభప్రదంబగు వి♦వాహము వీనుల నాలకించి దు
శ్చరితుఁడు లోభచిత్తుఁడు వి♦చారమునన్ శతధన్వుఁ
డెంతయో
నరమరఁజెంది కక్షఁగొని ♦ యాసత్రాజితు నెంచి తానదన్
జెఱపుఁదలంచె నిట్లు వర♦సిద్ధివినాయక భక్తపాలకా॥ ౫౭

ఉ॥ కన్యనునిత్తునంచుఁ గల♦కాలముమాటలు చెప్పిచెప్పి రా
జన్యునినన్ను వీడి కడు♦జారుఁడు చోరుఁడు పేదగొల్లకున్
మాన్యతనిచ్చినాఁడు కుల♦మాన్యుఁడె వీఁడు వధింతు
నంచు దా
క్షిణ్యమువీడె నంత వర♦సిద్ధివినాయక భక్తపాలకా॥ ౫౮

ఉ॥ దంతిపురంబునందకట ♦ దగ్ధులు నయ్యిరి లక్కయింటిలోఁ
గుంతితనూజులన్న పెను♦ గోడును మాధవుఁడాలకించి, ను
శ్చింతను ముగ్గి హస్తిపురిఁ ♦ జేరఁగ నాశతధన్వుఁడప్డు; ని
శ్చింతనుఖడ్గమూని; వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౫౯

ఉ॥ రాతిరి నిద్రఁబోవు సత♦ రాజితుకంఠముఁ ద్రుంచివైచి, దు
ష్ప్రాతకుఁ డాశమంతమును ♦ బట్టియునేగఁగ సత్రజిత్తు జా
యాతతి దుఃఖభారమున ♦ నాతనిపైఁబడియేడ్చి, నెత్తినిం
జేతులుమోదుకొంచు, వర♦సిద్ధివినాయక భక్తపాలకా॥ ౬౦

చ॥ జనకుని దుర్మృతిం గని, వి♦చారముఁబూనిన సత్యభామ గొ
బ్బునఁబడియేడ్చియేడ్చి శవ♦మున్ దహనంబొనరింపఁజేసి, హ
స్తినగరమందుఁజొచ్చి, వడి ♦ శ్రీధరు చెంతకుఁజేరి విన్నవిం
చెనుపితృదుర్మృతంబు; వర♦సిద్ధివినాయక భక్తపాలకా॥ ౬౧

ఉ॥ భండన భీము(డీమరణ ♦ వార్తకు దుఃఖముఁజెంది, సత్యభా
మాండజయానదుఃఖ భర♦మంతమునొందగ నూరడించి, త
త్పాండు సుతాళితో నరిగి♦వత్తునటంచు రథంబునెక్కి యు
ద్దండ హలాయుధుంగొనియు♦దారినిబట్టెను, శత్రుశీర్షముం
జెండెదనంచు వేఁగ; వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౬౨

చ॥ అటుశతధన్వుడుఁగ హరి ♦ హలాయుధు లెక్కుడు క్రోధచిత్తులై
పటుతరశస్త్రధారులయి ♦ వచ్చెడివార్తను నాలకించి దు
ర్ఘటమని భీతినొంది తుర ♦ గంబును నెక్కియుఁశౌర జొచ్చితాఁ
జటుకున మిత్రుజేరి, వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౬౩

ఉ॥ వైరముఁబూనిచక్రి ♦ బలభద్రులుసద్బలగర్వులయ్యెని
ష్కారణమిందువచ్చి ననుఁ♦జంపదలంచిరి కాంచినావె యీ
క్రూర, త్వదీయ సాయమును♦గోరటువచ్చితి కావవేదయం
జేరిచి యంచుఁ బల్కె వర♦సిద్ధివినాయక భక్తపాలకా॥ ౬౪

చ॥ పిలువఁగ భోజనంబునకు ♦ వేడ్కను వత్తురుగా కఁ జావగాఁ
బిలుతురె? పిల్వవత్తురొకొ? ♦ వెన్నునితోఁబగచావుఁదెచ్చుబో
నిలువక పొమ్మనంగను, మ♦ణిందగదాయఁగనిచ్చి, వాజితో
మిలఁగ నతండుపాఱె; వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౬౫

చ॥ అతిరయమొప్ప యోజన శ ♦ తంబునుదాటి హయంబు చావఁగా
మతిచెడి పాదచారియయి ♦ మానకఁబర్విడుదుష్టబుద్ధి యగా

శతధనువర్గ మురాంతకుఁడు ♦ సచ్ఛరవట్టులవెంటనంటెఁజ
చ్చితివిఁకఁబోఁకుమంచు వర♦సిద్ధివినాయక భక్తపాలకా॥

చ॥ హరియును పాదచారియయి♦యాశతధన్వునిపైకిచక్రమున్
గిరగిరఁ ద్రిప్పివేయఁగను ♦ గిర్రుననేగి శిరంబుఁద్రుంపఁగా
ధరఁబడె నా శవంబు కడఁ ♦ దన్మణిఁగానక సిగ్గుతోడఁ దా
శిరమ్మునువంచెఁ జక్రి; వర♦సిద్ధివినాయక భక్తపాలకా ॥౬౭

ఉ॥ ఘోరమహాపరాధివగు♦క్రూరుఁడవక్కట! ముఖ్యబంధునిన్
నేరములేకఁ గూల్చితివి ♦ నిర్దయ చిత్తుఁడవీవు. మాయలన్
మాఱవి, నిన్నుఁగాంచనఘ ♦ మౌ ఖలుఁడాయని తా విదగ్ధకుం
జేరె, హలాయుధుండు; వరసిద్ధివినాయకభక్తపాలకా॥ ౬౮

చ॥ అనుజనిపల్కులన్ విని, మ♦హాపరితాపము నంది,యక్కటా!
ఘనకలుషం బొనర్చితిని♦కార్యము మించెనటంచుఁ జింతచేఁ
దనునగరంబుఁజొచ్చి,శత♦ధన్వుఁడుతన్మణినెందొ దాచియుం
చెనని,దృఢంబుఁజెందిఁ వర♦సిద్ధిపినాయక భక్తపాలకా॥౬౯

చ॥ నగరము నంతయుఁ వెదకి♦సవ్యశమంతముఁ గానలేకఁ నా
దిగులున నిద్దురన్ మఱచి ♦ దీనతనుండెను చక్రపాణి; తన్
బగఁగొని చంపునోయనిశ్వ♦ఫల్కసూనుఁడు రత్నమందితా
సిగముడి పీడఁబాఱె; వర♦సిద్ధివినాయక భక్తపాలకా॥ ౭౦

చ॥ మనశతధన్వుఁజంపి,ఘన ♦ మౌమణిఁగ్రైకొనియగ్రజన్మునిం
బసిగొనితిట్టి దేశముల ♦ పాలొనరించెను వింటిరే కటా

ఘనకలుషుండు కృష్ణుఁడను ♦ కల్గినపాపుల వాక్యవహ్నిఁ బ్రే
ల్చెను గద శౌరెనంత వర♦సిద్ధివినాయక భక్తపాలకా॥ ౨౧

ఉ॥ పాయనిచింతతోఁ మతి ను ♦ పాయముఁగానకనుండునంతనా
రాయణశబ్ద రాజమును ♦ రంజిలఁబాడుచు నారదుండు వి
చ్చేయనమస్కరించి, దయ♦సేయుమహాసనమిచ్చిసర్వముల్
క్షేమముఁజేసెఁజక్రి వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥

ఉ॥ నారదుఁడా మురారివచ ♦ నంబులు శ్రద్ధగ నాలకించి ని
ష్కారణకార్యమున్నె! యన ♦ ఘూ లలనాథుఁడిద్ద అబ్బగాఁ
గారణమయ్యె మర్త్యశము♦కల్గెనుగాదె మహాత్మ లేచిచోఁ
జేరునె, నిన్నఁటంచు వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౨3

చ॥ ఘనతర శాపపీడనము గల్గిన చంద్రుని మోముఁగాంచుటన్
ఘన నపవాద మబ్బెనను ♦ కల్గెనటంచును శాపకారణం
బును వచియించి, దీవన ల♦మోఘము గానిశి దేవమౌని దూ
సిన శరమట్టులేగె, వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౨౪

ఉ॥ నారదుఁడాడినట్టి వచ ♦ నంబులు శ్రద్ధగ నాలకించి, హృ
ద్వారిజమందు నిల్పితిని ♦ భక్తియురక్తియుఁదాండవింపగా
గూరిమిఁగొల్చి నీకథలు♦కోమలచిత్తము నంటుఁజేస్తుమన్
శ్రీరమణుండు వెల్గె వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా ౨౫

ఉ॥ అంతటఁ బౌరులెల్లరు ము♦రాంతకుఁజేరి నమస్కరించి పా
పాంతక యీతిబాధలిఁకఁ ♦ బట్టణమందున నెక్కుడయ్యె మే

మింతను మున్నెఱుంగమిది♦యే విపరీతము దేవ మమ్ము ర
క్షింతువు పేవలంచు వర♦సిద్ధివినాయక భక్తపాలకా॥ ౭౬

ఉ॥ ఆరయఁ గారణాంబొకటి♦యైన కనుపట్టుకచిత్తగింపు మ
క్రూరుఁడు లేని హేతువున♦గొబ్బున బాధలు సంభవించె సూ
వారకనీక్షణంబున శ్య♦మల్యుతయాజుని పట్టణంబు నం
జేరిచి ప్రోవుమన్న వర♦సిద్ధివినాయక భక్తపాలకా॥ ౭౭

ఉ॥ హారిపనుపంగ నేగిన భ♦టాళివనంబుల దాటి కాశి కా
వరపురమందుఁ గన్గొని శ్య♦మల్యుని సూనుని వోకి తెచ్చినం
బురజనులెల్ల సంతసముఁ♦బొందిరి దుర్దశయుండొలంగె నో
స్థిరచరభూరినాథ వర♦సిద్ధివినాయక భక్తపాలకా॥ ౭౮

చ॥ ఒకదినమందుఁ గ్రూరరహి♦తుం బిలిపించి "శ్యమల్యునందనా
సకలమెఱింగినాఁడ నీక ♦ సన్మణి నిమ్ము మదీయమస్థితిన్
వికలము జేసి యామణిని ♦ వేగమె నీకిమవాఁడ"నన్నఁ దాఁ
జెకఁజెకమూటవిప్పి వర♦సిద్ధివినాయక భక్తపాలకా॥ ౭౯

చ॥ మణినొసగంగ నంది, యము ♦ మానముతీరగఁ జిన్నపెద్దలుం
గననిజమున్ వచించియును♦గ్రమ్మర నాతని కిచ్చి వేయఁగా
ఘనముదమందినత్నముమ♦గంఠమునందుఁ దాల్చి వేఁజనన్
జనమను దివ్యతేజ! వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౮౦

కాంచితిరే జనార్దనుని ♦ కల్మషవాక్యము లాడియాడి, దు
ర్వంచనఁ జేసి నామకట ♦ పాపులమైతిమి, సత్యమెన్నఁ గాం
క్షించని దుష్టచిత్తుల మి♦సీ మని కృష్ణునివంద్యములంటి పూ
జించిరి పౌరులంత; వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౮౧

ఉ॥ క్రూరవిహీనమైన బుధ ♦ కోటినిఁ గోరుచు సర్వసంపదల్
కోరకఁ దా స్యమంతకము ♦ గూర్మిని సజ్జనమాన్యుఁడైన, యా
క్రూరని బిల్చి మాధవుఁడు ♦ గొబ్బున సన్నుతిసేయ లేదె? సు
శ్రీరమణీయరూప! వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౯౭

ఉ॥ అప్పటినుండి భద్రపద ♦ మందున శుద్ధచతుర్థినాఁడు దా
నొప్పఁగ నన్నుఁ గొల్చియు, మహోజ్జ్వలసజ్జయసౌఖ్యసంపద
లొప్పఁగఁ గాంచి సద్యశము ♦ ధారుణి నిల్పెను శౌరి, నీ కథ
ల్చెప్పఁగ శక్యమా? వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా ॥ ౯౮

చ॥ వరయువవర్షమందుఁ గల ♦ భాద్రపదంబున దర్శపర్వమం
దరయఁగ నీ స్యమంతసుకృ ♦ తంబును బూర్తిగ నర్చ్చి నీదుసుం
దరపదపద్మసన్నిధిని ♦ దప్పక సర్పణఁ జేసితి కృతిన్
స్థిరకృపఁ గావుమయ్య వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౯౯

చ॥ వినయము తోడ నీకృతిని ♦ విన్నను భక్తిఁ బఠించిన సదా
వినుతమహాప్రభావమున ♦ వీడదె ల్ల మహాపవాదముల్
ఘనధన పుత్రపౌత్రసుఖ ♦ గౌరవమోక్షము లబ్బు నీకృపం
జనమయ దివ్యకాయ వర ♦ సిద్ధివినాయక భక్తపాలకా॥ ౧౦౦

సంపూర్ణము.

ఏతత్ఫలమ్

శ్రీవరసిద్ధ వినాయక పరబ్రహ్మార్పణమస్తు.

సర్వేజనా స్సుఖినో భవంతు.

మంగళం మహత్.

# ఏతత్కవికృత గ్రంథములు

1 శ్రీరామగీతావళి (గీతపద్యశతకము)

2 వేశ్యాకర్ణకఠోరము (దురాచార ఖండన)

3 రుక్మిణి.
(భక్తిరస ప్రధానమగు 5 అంకముల నాటకము)

4 విజయకాళి.
(చరిత్రాత్మకమగు. అంకముల 5 నాటకము.)

5 మాయామధుసూదన.
(భక్తజనరంజకమగు అంకముల 5 నాటకము.)

6 సద్భక్తపుండరీక.
(నవరసభరితమగు అంకముల 5 నాటకము.)

7 గ్రహచారము

8 పార్వతీశ్వర శతకము (భక్తిరస భరితము)

8 యోగలింగేశ్వర శతకము (ముక్తిదాయకము)

10 శ్రీ వినాయక శతకమగు శమంతకోపాఖ్యానము } (నూతనాష్టోత్తర శతనామంబులు గలవు)

11 కుమారీశతకము (నీతిబోధ)